

# కుమారీ శతకము.



పక్కి వేంకటనారసింహకవి ప్రణీతము.

బ్రహ్మశ్రీ మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రి
విరచిత టీకాతాత్పర్యసహితము.



రాజమండ్రి బుక్ సెల్లర్సు
కగ్రా అచ్చయ్య అండ్ సన్సువారిచే
ప్రకటితము.

 [వెల 3 అణాలు.

రాజమహేంద్రవర
దేశీయ విద్యాలయ ముద్రణాలయమున ముద్రాపితము

1924

శ్రీరస్తు.

# కు మా రీ శ త క ము.



టీకా తాత్పర్య సహితము.

భూ నీళా హైమవ
తీ భారతు లతుల శుభవ ♦ తిగ నెన్నుచు స
త్సౌభాగ్యము నీ కొసఁగఁగ
లో భావించెదరు ధర్మ ♦ లోల కుమారీ. 1

టీ. ధర్మలోల = ధర్మమునందు ఆసక్తికల, కుమారీ=చిన్నదానా, శ్రీ=లక్ష్మీదేవియును, భూ=భూదేవియును, నీళా=నీళాదేవియును, హైమవతీ=పార్వతీదేవియును, భారతులు=సరస్వతీదేవియును, అతుల=నిన్ను సాటిలేని, శుభవతిగన్=మంగళవతిగా, ఎన్నుచున్ = తలచుచు, సత్ = మంచిదైన, సౌభాగ్యము=మంచిభాగ్యమును, నీకున్=నీకు, ఒసగగన్ = ఇచ్చుటకు, లోన్=మనస్సులయందు, భావించెదరు=తలంచెదరుగాక

తాత్పర్యము—ధర్మమునందు ఆసక్తికల చిన్నదానా! లక్ష్మీదేవియు, భూదేవియు, నీళాదేవియు, పార్వతీదేవియు, సరస్వతీదేవియు, నీమంచి గుణములకు సంతసించి సంపదలనెల్ల నీ కిచ్చెదరు గాక!

క. చెప్పెడి బుద్ధుల లోపలఁ
దప్పకు మొకటైన సర్వ ♦ ధర్మములందున్
మెప్పొంది యిహపరంబులఁ
దప్పింతయు లేక మెలఁగఁ ♦ దగును కుమారీ. 2

టీ. కుమారీ! చెప్పెడి బుద్ధుల లోపలన్ = నేను నీకు చెప్పునట్టి బుద్ధులయందు, ఒకటైనన్=ఒక్కదానినైనను, తప్పకుము= విడువకుము, సర్వధర్మములందున్ = అన్నిధర్మములయందును, మెప్పొంది = గౌరవమునుపొంది, ఇహపరంబులయందున్ = ఈ లోకమునను, పై లోకమునను, తప్పు=చెడుగు, ఇంతైనన్= కొంచెమైనను, లేక = లేనటుల. మెలగదగును= నడువ వలెను.

తా॥ కుమారీ! నేను చెప్పునట్టి బుద్ధులయందు ఒకదానినైనను విడువకుము. అన్ని ధర్మములయందును గౌరవమును పొంది, ఈలోకమునను, పై లోకమునను తప్పు కొంచెమైనను లేనటుల నడచుకొనుము. అటుల నడచుకొంటివేని ఈలోకమున మెప్పును పై లోకమున సౌఖ్యమును బొందెదవు.

క. ఆటలఁ బాటలలో నే
మాటయు రాకుండఁ దండ్రి ♦ మందిరమందున్
బాటిల్లు కాఁపురములో
వాట మెరిఁగి బాల తిరుగ ♦ వలయుఁ గుమారీ.

టీ. కుమారీ! తండ్రిమందిరమందున్ = తండ్రిగారి యింటి యందు (అనగా పుట్టినయింట నున్నకాలమునందు) ఆటలన్= ఆటలయందును, పాటలన్ = పాటలయందును, ఏమాటయు =

ఏలాటి చెడుమాటయును, రాకుండన్=కలుగకుండునటులను, పాటిల్లు=మంచిదైన, కాపురములో=కుటుంబమునందు, వాట ముఁగా=తీరును, ఎఱిగి=తెలిసికొని, బాల=బాలిక, తిరుగవలెను= నడువవలెను.

క. మగనికి నత్తకు మామకుఁ
దగ సేవ యొనర్పు చోట ♦ దత్పరి చర్యన్
మిగుల నుతిఁ బొందుచుండుట
మగువలకుం బాడి తెలిసి ♦ మసలు కుమారీ. 4

టీ. కుమారీ! మగనికిఁగా=మగనికిని, అత్తకుఁగా=అత్తకును, మామకున్=మామకును, తగన్=తగినటుల, సేవ=ఉపచారము ఒనర్పుచోటఁగా=చేయుపనులయందును, తత్=వారియొక్క, పరి చర్యన్ = అనుసరించుటయందును, మిగులన్ = ఎక్కువగా, నుతిఁగా=మెప్పును, పొందుచుండుట=పొందుచుండడము,మగువ లకున్ = ఆడువాండ్రకు, పాడి=మంచిది అని, తెలిసి=ఎఱిగి, మసలు=తిరుగుము.

తా॥ కుమారీ! మగనికిని, అత్తకును, మామకును, సేవ జేయుచు వారి వలన మెప్పును బొందుట స్త్రీలకు మంచిది. అందువలన అది యెఱిగి తిరుగుము.

క. పెనిమిటి వల దని చెప్పిన
పని యెన్నఁడుఁ జేయరాదు ♦ బావల కెదుటన్
గనఁబడఁగరాదు కోపము
మనమున నిడుకొనక యెపుడు ♦ మసలు కుమారీ. 5

టీ. కుమారీ! పెనిమిటి=మగడు, వలదని = చేయువద్దని, చెప్పిన పని=చెప్పిన పనిని, ఎన్నఁడున్=ఎప్పుడైనను, చేయరాదు=చేయకూడదు, బావలకు=మగని అన్నగారలకు, ఎదుటన్=ఎదురను, కనబడరాదు=కనబడగూడదు, ఎపుడున్ = ఏవేళనైనను, మనమునన్=మనస్సునందు, కోపము = కోపమును, ఇడుకొనక=ఉంచుకొనక, మసలు=తిరుగుము.

తా॥ కుమారీ మగడు చేయవద్దనిన పనిని యెప్పుడును చేయకుము. మనస్సున కోపము నుంచుకొనక తిరుగుము.

క. పరపురుషు లన్నదమ్ములు
వరుఁడే దైవంబు తోడి ♦ పడుచులు వదినెల్
మఱఁదండ్రు సత్తమామలు
ధరఁ దల్లియుఁ దండ్రి యనియుఁ ♦ దలపు కుమారీ. 6

టీ. కుమారీ! ధరన=భూమియందు, పరపురుషులు=ఇతరులైనమగవారు, అన్నదమ్ములు = తోడబుట్టినవారు, వరుడే=మగడే, దైవంబు=దేవుడు, వదినెల్=నీమగని అక్కలు, మరదండ్రు=నీమగని చెల్లెండ్రు, తోడిపడుచులు = చెలికత్తెలుగా, అత్తమామలు=అత్తను మామను, తల్లియున్ = తల్లియనియు, తండ్రియున్=తండ్రియనియు, తలపుము=తలంచుము.

తా॥ కుమారీ! ఇతరపురుషులను అన్నదమ్ములవలెను, మగనిని దేవునివలెను, వదినెలను మరదండ్రను చెలికత్తెలవలెను, అత్తమామలను తల్లిదండ్రులవలెను తలచుచుండ వలెను.

క. పదముల పైఁ జేయి వేయక
మదవతి పతిచెంత నిద్ర ♦ మరగినఁ జేతుల్
గదలంగ నీక గట్టుచు
గదఁ గొని శిక్షించు యముఁడు ♦ కాంక్షఁగుమారీ. 7

టీ. కుమారీ! మదవతి=స్త్రీ, పదములపైన్ = మగనిపాదములపైని, చేయివేయక=చేతి నిడక, (పాదముల నొత్తక) పతిచెంతన్=మగనిదగ్గర, నిద్రమరగినన్=నిద్రపోయినయెడల, యముఁడు=యమధర్మరాజు, చేతుల్ = (అట్టి స్త్రీ) చేతులను, కదలంగనీక=కదలకుండునటుల, కట్టుచున్=కట్టుచు, గదన్=గదను, (ఇది యొక ఆయుధము) కొని=తీసికొని, కాంక్షన్=కోరికతోడ, శిక్షించున్=దండించును.

తా॥ కుమారీ! స్త్రీ నిద్రించునపుడు మగని పాదములనొత్తకయే నిదురించినయెడల యముడామెచేతులను కట్టి గదతో గొట్టును.

క. తెచ్చినఁ దేకుండిన నీ
కిచ్చిన నీకున్న మగని ♦ నెగ్గాడకుమీ
యొచ్చెము నీపైఁ దేలును
రచ్చలకా మాట లెక్క ♦ రవ్వ కుమారీ. 8

టీ. కుమారీ! తెచ్చినన్=నీమగడేవస్తువునైనను తెచ్చినను, తేకుండినన్=తేకపోయినను, నీకిచ్చినన్=నీకిచ్చినను, ఈకున్నన్=ఇవ్వకున్నను, మగనిన్=మగనిని, ఎగ్గాడకుమీ=కీడుపలుకకుసుమా, ఒచ్చెము=నేరము, నీపైన్-నీమీదను, తేలును=నిలు

చును, ఆమాటలు=నీవనినమాటలు, రచ్చలకుఁ = సభలకు, ఎక్కన్=పోవును, రవ్వ=నింద (వచ్చును).

తా॥ కుమారీ మగడు ఏవస్తువునేని తెచ్చినను తే లేకపో యినను, నీ కిచ్చినను యివ్వకున్నను, ఆతని నిందించకుము. నిం దించితివేని ఆతప్పు నీపై బడును. నిన్ను అందరును నిందింతురు.

క. మఱఁదండ్రి వదినె లత్తలు
మఱఁదులు బావల కొమాళ్ళు ♦ మఱి పెద్దలు రా
నురవడిఁ బీటలు మంచము
లరుఁగులుఁ దిగుచుండవలయు ♦ నమ్మ కుమారీ. 9

టీ. అమ్మా! కుమారీ! మరదండ్రి, వదినెలు, అత్తలు, మరదులు, బావలు, బావలకొమాళ్లు, మఱి=ఇంకను, పెద్దలు= పెద్దవారు, రాన్=వచ్చినయెడల, ఉరవడిఁ=వేగముగ, అరు గులు దిగుచుండవలెను.

తా. అమ్మా! కుమారీ! వదినెలు, మఱఁదండ్రి, అత్తలు, మామలు, బావలు, మఱదులు, వారి కుమాళ్లు వీరిలో ఎవరు వచ్చినను, మంచము మొదలగు ఎత్తయినచోట కూర్చుండిన యెడల క్రిందికి దిగవలెను.

క. నో రెత్తి మాటలాడకు
మాఱాడకు కోపపడిన ♦ మర్యాదలలో
గోరంత తప్పి తిరుగకు
మీఱకు మీయత్తపనుల ♦ మెలఁగు కుమారీ. 10

టీ. కుమారీ! నోరెత్తి=గొంతుగనెత్తి, (అనగా గట్టిగా)

మాటలాడకుము, కోపపడిన = పెద్దవారు కోపపడినయెడల, మాఱాడకు=తిరుగ జవాబున్ జెప్పకుము, మర్యాదలలోన్= ఆచారములలో, గోరంత = కొంచెమైనను, తప్పి తిరుగకు= విడిచినడువకు, అత్తపనులన్=అత్తగారి కార్యములను, మీఱకుము=అతిక్రమించకుము, మెలగు=(ఈరీతిని)నడుచుకొనుము.

తా. కుమారీ! గొంతెత్తి గట్టిగా మాటలాడకుము. పెద్దలు కోపించినయెడల వారి నెదుర్కొనక, మర్యాద విడువక తిరుగుము. అత్తగారి పనులను మఱకుము.

క. పతి పరకాంతలతో సం
 గతిఁ జేసిన నాదుపుణ్య ♦ గతి యిట్లనుచున్
 మతిఁ దలఁపవలయు లేదా
 బతిమాలగవలయుఁ గలహ ♦ పడక కుమారీ. 11

టీ. కుమారీ! పతి=మగఁడు, పరకాంతల=ఇతరస్త్రీల, సంగతి=స్నేహము, చేసినన్=చేసినయెడల నాదు=నాయొక్క, పుణ్యగతి=పుణ్యముయొక్క త్రోవ, ఇటుల=ఈరీతిగా, అనుచున్= ఉన్నదనుకొనుచు, మతిఁ = మనస్సునందు, తలపవలయున్= తలచుకొనవలెను. లేదా=ఆలాగున తలంచనియెడల, కలహపడక=తగవుపడక, బ్రతిమాలగవలయు=(ఇట్టిపనిచేయువద్దని) వేడుకొనవలెను.

తా. కుమారీ మగడు ఇతరస్త్రీలతో కూడియున్న యెడల నాపుణ్య మీలాగు నున్నదని యూఱకొనవలెను. లేదా తగవుపడక బ్రతిమాలుకొనవలెను.

క. పతి పాపపుఁ బనిఁ జెప్పిన
బతిమాలి మఱల్పవలయుఁ ♦ బతి వినకున్నన్
హితమనుచు నాచరింపుము
మతిలోపల సంశయంబు ♦ మాని కుమారీ. 11

టీ. కుమారీ! పతి=భర్త, పాపపుఁబనిని=చెడ్డపనిని, చెప్పిన=(చేయుమని) చెప్పినయెడల, బతిమాలి=వేడుకొని, మఱల్పవలయు=త్రిప్పవలెను, పతి=భర్త, వినకున్నన్=వినక పోయిన యెడల, హితము అనుచును=ఇష్టము అనుచు, మతిలోపలన్=మనస్సునందు, సంశయంబున్=అనుమానమును, మాని=విడిచి ఆచరింపుము=చేయుము.

తా. కుమారీ! భర్త చెడ్డపనిని చేయుమనినయెడల నీవ తని వేడుకొని, ఆపనినుండి ఆతని బుద్ధిని త్రిప్పవలెను. వినకున్న మంచికార్య మని చేయువలెను.

క. తిట్టినఁ దిట్టక కొట్టినఁ
గొట్టక కోపించెనేనిఁ ♦ గోపింపక నీ
పుట్టిన యింటికిఁ బాదము
పెట్టిన యింటికిని వన్నె ♦ పెట్టు కుమారీ! 13

టీ. కుమారీ! తిట్టినన్=(మగడు నిన్ను) తిట్టినయెడల తిట్టక=(నీవు మరల) తిట్టక, కొట్టినన్=కొట్టినయెడల, కొట్టక=(మరల) కొట్టక, కోపించెనేని = నిన్ను కోపగించినయెడల, కోపింపక=తిరిగి నీవు కోపించక, నీపుట్టినయింటికి=నీపుట్టింటి వారలకును, పాదముపెట్టినయింటికిని = అత్తవారింటివారికిని,

వన్నె=గౌరవమును, పెట్టుము=కలుగజేయుము.

తా. కుమారీ! మగడు నిన్ను తిట్టినయెడల నీవు తిట్టక, కొట్టినయెడల తిరిగి కొట్టక, కోపగించినయెడల నీవు కోపగించక, పుట్టింటివారికిని అత్తవారింటివారికిని కీర్తిని కలుగజేయుము.

క. దబ్బఱలాడకు కదిమిన
బొబ్బల్బెట్టకుము మంచి ♦ బుద్ధి గలిగి యెం
దెబ్బెఱికముఁ బూనక కడు
గొబ్బునఁ జిత్తమున వానిఁ ♦ గూర్పు కుమారీ. 14

టీ. కుమారీ! దబ్బరలు=అబద్ధములు, ఆడకుము = పలుక వలదు, కదిమినన్=నీమగడు కొట్టినపుడు, బొబ్బలు పెట్టకు= పెద్ద కేకలు వేయకుము, మంచిబుద్ధిగలిగి=మంచి బుద్ధి తెచ్చుకొని, ఎందున్=(పతిజెప్పిన) ఏపనియందైనను, చిత్తమునన్= మనస్సునందు, ఎబ్బెఱికము=అసహ్యమును, పూనక=పొందక, కడుగొబ్బున = మిక్కిలి వేగముగా, వానిన్ = ఆపనులను, కూర్పుము=చేయుము.

తా. కుమారీ! అబద్ధములు చెప్పకుము. మగడు కొట్ట వచ్చినపుడు పెద్ద కేకలు వేయకుము. భర్త యేపని చెప్పినను విసుగుచెందక చేయుము.

క. పతి భుజియించిన పాత్రను
మెతుకొక్కటియైన భార్య ♦ మెసఁగుటకై తా
హిత మూనకున్న నదియొక

నడచుకొనుము.

క. అమ్మకు రెం డబ్బకు రెం
డిమ్మహిఁ దిట్టించు కూతు ♦ రెందుకు ధర నా
దిమ్మరి పుట్టక పోయిన
నిమ్మళ మని యందు ర్జనులు ♦ నిజము కుమారీ. 19

టీ. కుమారీ! అమ్మకున్ = తల్లికి, రెండు = (కొన్నితిట్లును) అబ్బకున్ = తండ్రికి, రెండు = (కొన్నితిట్లును) ఇమ్మహిన్ = ఈ భూమియందు, తిట్టించుకూతురు = తిట్టించెడు కుమార్తె, ఎందుకు = పుట్టిన ఏమిలాభము, ధరన్ = భూమియందు, ఆదిమ్మరి = అతి రుగులాటగల స్త్రీ, పుట్టకపోయిన = పుట్టనియెడల, నిమ్మళమని = సుఖమని, అందుర్ = అందురు, నిజము.

తా. కుమారీ! తల్లిదండ్రులను జనులచే తిట్టించు కూతురు పుట్టకుండుటయె సుఖము.

క. తన బావల పిల్లలయెడఁ
దన మఱఁదుల పిల్లలందుఁ ♦ దనపిల్లలకం
టెను మక్కువ యుండవలెన్
వనితల కటులైన వన్నె ♦ వచ్చుఁ గుమారీ. 20

టీ. కుమారీ! తనబావల పిల్లలయెడన్ = తన బావల బిడ్డల యందును, తన మఱదుల పిల్లలందున్ = తనమఱదులబిడ్డలందును, తన పిల్లలకంటెను, మక్కువ = ప్రేమ, ఉండవలెన్ = ఉండవల యును, అటులైనన్ ఆలాగైనయెడల, వనితలకున్ = స్త్రీలకు, వన్నె వచ్చున్ = కీర్తి వచ్చును.

తా. కుమారీ! స్త్రీ తన బావగారి పిల్లలయందును, మఱదుల పిల్లలయందును, తనపిల్లలకంటె ఎక్కువప్రేమ ఉన్న మొదల కీర్తిగలది యగును.

క. ధనహీనుఁడైనఁ గడు దు
ర్జనుఁడైనఁ గురూపియైన ♦ జారుండైనన్
విను పాపియైన నెప్పుడుఁ
దనపతియే తనకు దైవ ♦ తంబు కుమారీ. 21

టీ. కుమారీ! ధనహీనుడైనన్ = ధనములేనివాడైనను, కడు=మిగుల, దుర్జనుడైనన్ = దుర్మార్గుడైనను, కురూపియైనన్=రూపములేనివాడైనను, జారుండైనన్ = పరస్త్రీసాంగత్యముచేయువాడైనను, పాపియైనన్ = పాపాత్ముడైనను, తనపతియే=తన భర్తయే, తనకు=స్త్రీకి, దైవంబు= దేవుడు.

భా. కుమారీ! ధనములేనివాడైనను, దుర్మార్గుడైనను, అందములేనివాడైనను, తనభర్తయే స్త్రీకి దేవుడు.

క. ధనవంతుఁడైన యప్పుడు
పెనిమిటిచిత్తం బెఱింగి ♦ పెండ్లాము మెలం
గును; లేమి మెలఁగనేర్చిన
వనితకు లోకమున వన్నె ♦ వచ్చుఁ గుమారీ. 22

టీ. కుమారీ! ధనవంతుడు=ధనముగలవాడు,ఐనయప్పుడు=అయినకాలమందు, పెండ్లాము=భార్య, పెనిమిటిచిత్తము=భర్తయొక్క మనస్సును, ఎఱింగి=తెలిసికొని, మెలంగును=తిరుగును, లేమిన్ = ధనములేనప్పుడు, మెలగనేర్చిన=తిరుగనెఱి

గిన, వనితకు=ఆడుదానికి, లోకమునన్=జగమునందు, వన్నె=కీర్తి, వచ్చున్=వచ్చును.

తా. భర్త ధనముగలవాడైనప్పుడు అతనియిష్టమువచ్చినటుల తిరుగుట గొప్పగాదు. ధనములేనప్పుడు అతనికి సంతోషమును కలుగునటుల తిరుగ నేర్చినదియే లోకమున కీర్తి కలదగును.

క. తలిదండ్రు లన్నదమ్ములు
తులఁదూఁగఁగనిమ్ము పసిఁడి ♦ తో నైనను వా
రల యింట సతత ముండుట
వెలదికి మర్యాదగాదు ♦ వినవె కుమారీ. 23

టీ. కుమారీ! వినవె=ఆలకింపవె; తలిదండ్రులు, అన్నదమ్ములు, పసిడితోనైనను=బంగారముతోనైనను, తులదూగగనిమ్ము=త్రాసున సరిగానుండనిమ్ము, వారలయింటన్=పుట్టినింటను, సతతము=ఎల్లప్పుడును, ఉండుట=ఉండడము, వెలదికి=ఆడుదానికి, మర్యాదగాదు=గొప్పగాదు, మంచిదిగాదు.

తా. కుమారీ! తలిదండ్రు లెంతధనవంతులైనను వారి యింట చాలకాలముండుట స్త్రీకి మంచిదిగాదు.

క. కడుపారఁ గూడుఁ గూరలుఁ
దొడవులు వస్త్రములు మిగుల ♦ దొరకవనుచుఁ దా
పడిలేవమునఁ బెనిమిటితో
నెడఁబాసి చరింపఁగూడ ♦ దెపుడుఁ గుమారీ. 24

తా॥ కుమారీ! కడుపారన్=పొట్టనిండుగా, కూడుఁగూరలు=

అన్నము, కూరలు, తొడవులు=నగలును, వస్త్రములు=బట్టలు, మిగులన్=అధికముగా, దొరకవనుచు=దొరకవని, తాన్=తాను, వడితనమునన్=పట్టుదలతో, ఎడబాసి=విడిచిపెట్టి, ఎప్పుడున్=ఎప్పుడును, చరింపగూడదు=తిరుగరాదు.

తా. కుమారీ! మంచి అన్నమును, బట్టలును, నగలును, లేవని భర్తను వీడిపోవుట తగదు.

క. పిల్లలఁ గనఁగొనఁ దలఁచిన
యిల్లాలు గతాగతంబు ♦ లెఱుఁగక త్రాగై
యల్లరిఁ బెట్టినఁ జెడుఁ దా
నుల్లసములఁ బడును కీడు ♦ నొందుఁ గుమారీ. 25

టీ. కుమారీ! పిల్లలన్=బిడ్డలను, కనఁగొనఁదలచిన=కనదలంచినచో, గతాగతంబులు=ఆదాయవ్యయములను, ఎఱుఁగక=తెలియక, త్రాగై=గయ్యాళియై, యిల్లాలు=భార్య, అల్లరిపెట్టినన్=గోలచేసినయెడల, తాన్=తానే,. చెడును=కీడునొందును, ఉల్లసములన్=నిందలను, పడున్=పొందును, కీడున్=చెడ్డను, ఒందున్=పొందును.

తా. కుమారీ! పిల్లలను కననెంచినస్త్రీ తనకాఁపురము నెఱుఁగక అల్లరిబెట్టినయెడల నిందలపాలై చెడిపోవును.

క. పతి కత్తకు మామకు స
మ్మతిగాని ప్రయోజనంబు ♦ మానఁగవలయుఁ
హితమాచరింపవలయును
బ్రతుకున కొకవంక లేక ♦ పరఁగు గుమారీ. 26

టీ. కుమారీ=అమ్మాయీ, పతికిన్=మగనికిని, అత్తకున్=అత్తకును, మామకున్=మామకును, సమ్మతిగాని=ఇష్టముగాని, ప్రయోజనంబు=పనిని, మానఁగవలయు = విడిచి వేయవలెను, హితము=వారల కిష్టమైనదానిని, ఆచరింపవలయును = చేయవలెను, బ్రతుకునకు=తనజీవితమునకు, ఒకవంక లేక=ఒక తప్పు లేక, పరగు=ఉండుము.

తా. అమ్మాయీ! మగనికిని, అత్తకును, మామకును ఇష్టములేని కార్యమును మాని వారి కిష్టములైన వానిని చేయుచు తనకు తప్పురాకుండ స్త్రీ తిరుగవలెను.

క. పోకిళ్ళుపోక పొందిక
నాకులలోఁ బిందెకీతి ♦ నడఁకువగా నెం
తో కలసి మెలసి యుండిన
లోకములోపలను దా వె ♦ లుంగుఁ గుమారీ. 27

టీ. అమ్మాయీ! పోకిళ్ళుపోక=తప్పుపనులుచేయక, పొందికన్=ఇమిడికగా, ఆకులలోపిందెరీతి=ఆకులలోనుండి కాన్పింపకున్న పిందెవలె, అడకువగా=వినయముగా, ఎంతో=మిక్కలి, కలసి మెలసి=సంతోషముగా, ఉండినన్=ఉన్నయెడల, లోకములోపలను=లోకమునందు, తాన్ = తాను, వెలుంగున్ = కీర్తినొందును.

తా. కుమారీ! తప్పుపనులు చేయక ఆకులలోనిపిందెవలె అడకువగా నున్నయెడల స్త్రీ కీర్తిగలదగును.

విష్ణువుయొక్క పాదసేవ, నెమ్మిన్ = ప్రేమతో, చేయున్= పొందించును.

తా. అమ్మాయీ! మగని పాదపద్మంబులనె జీవములని నమ్మిన స్త్రీకి విష్ణునిపాదసేవ కలుగును.

క. కడు బుద్ధిగల్గి మెలఁగినఁ
బడఁతుక పుట్టింటివారు ♦ పదివేల వరా
లిడుకంటెఁ గీర్తియగు ద
మ్మిడి లేకుండినను నేర్పె ♦ మెలఁగు కుమారీ. 32

టీ. కుమారీ! పడతుక=స్త్రీ, కడుబుద్ధిగల్గి=మంచిబుద్ధిగల్గి, మెలగిన=తిరిగిన, పుట్టింటివారు = తల్లిదండ్రులు మొదలయినవారు, పదివేలవరాలు = పది వేలవరాలధనమును, ఇడుకంటె = ఇచ్చినకంటెను, కీర్తియగున్=కీర్తివచ్చును, దమ్మిడి లేకుండినను = పైసలేకపోయినను, నేర్పె = కాపురముచేయు విధము నెఱిగి, మెలఁగు=తిఱుగుము.

తా. అమ్మాయీ! ఆడుది మంచిబుద్ధి గలిగి తిరిగినయెడల తల్లిదండ్రులు మిక్కిలి ధన మిచ్చినకంటె కీర్తి వచ్చును.గావున దీనిని నెఱిగి తిరుగుము.

క. కడుఁ బెద్దమాటఁ దెచ్చినఁ
జెడుగై వర్తించెనేనిఁ ♦ జిరతరచింతఁ
బడుదురు తలిదండ్రులు తోఁ
బడుచులు సోదరులు నిందఁ ♦ బడుచుఁ గుమారీ. 33

టీ. అమ్మా! పడతుక=స్త్రీ,కడున్=మిక్కిలి,పెద్దమాటన్=

ధనముగల పెద్దమూటను, తెచ్చినను= తెచ్చినప్పటికిని, చెడు గై = చెడ్డదై, వర్తించె నేని=తిరిగినయెడల, తలిదండ్రులు, తోబుట్టులు=అక్కచెల్లెండ్రు, సోదరులు=అన్నదమ్ములు, నింద బడుచున్=అపకీర్తి నొందుచు, చిరతర=గొప్పదైన, చింతన్= విచారమునను, బడుదురు=పొందుదురు.

తా. అమ్మాయీ! స్త్రీ పెద్ద ధనపుమూట దెచ్చినను, చెడ్డదై తిరిగె నేని తల్లిదండ్రులు, అక్కచెల్లెండ్రు, అన్నదమ్ములు తీరని దుఃఖమును బొందుదురు.

క. పుట్టింటివారి నీచతఁ
బెట్టకు మత్తింటివారు ♦ పెట్టెడి బాధల్
పుట్టింటఁ దెలియనీయకు
రట్టడిచెలియందు రదియె ♦ రవ్వ కుమారీ. 34

టీ. కుమారీ! పుట్టింటివారిన్=పుట్టినయింటివారిని, నీచతన్=అపకీర్తిని; పెట్టకుము=ఉంచకుము, అత్తింటివారు=అత్తగారి యింటిలోనివారు, పెట్టినబాధల్ = పెట్టిన కష్టములను, పుట్టింటన్=పుట్టినయింటివారికి, తెలియనీయకుము=చెప్పకుము. రట్టడిచెలి=(అట్లు చెప్పినయెడల)అల్లరి స్త్రీ యని, అందురు= చెప్పుకొందురు, అదియె=అట్లు లోకులు చెప్పు కొనుటయె, రవ్వ=తప్పు సుమా!

తా. పుట్టింటివారికి అపకీర్తి కలుగనీయకుము. అత్త మొదలగువారు పెట్టిన బాధలను పుట్టింటివారికి తెలియనీయకుము. అట్లు తెలియ జేసినచో లోకులు అల్లరి స్త్రీ యని నిందింతురు.

క. అత్తపయిఁ మఱఁదలి పయి
నెత్తిన కోపమున బిడ్డ ♦ నేడ్పించుటకై
మొత్తినఁ దనకే కీడగుఁ
జిత్తమునం దీనిఁ జింత ♦ సేయు కుమారీ. 28

టీ. అత్తపయిన్=అత్తగారిమీదను, మఱదలిపైన్=మఱదలిమీదను, ఎత్తినకోపమున=వచ్చిన కోపముచేత, బిడ్డను=పిల్లను, ఏడ్పించుటకై యొత్తిన=కొట్టిన, తనకే, కీడు=నష్టము, అగున్=కలుగును, దీనిని=దీనిని, చిత్తమునన్=మనస్సునందు, చింతసేయుము=ఆలోచించుము.

తా. అత్తగారిమీదను, మఱదలిమీదనువచ్చిన కోపమున పిల్లలను కొట్టినయెడల నష్టము తనకే కలుగును.

క. మృతియైనను బ్రతుకైనం
బతితోడనె సతికిఁ జెల్లుఁ ♦ బతిఁ బాసిన యా
బ్రతు కొకబ్రతుకా జీవ
న్మృతిగాక వధూటి కెన్న ♦ నిదియుఁ గుమారీ. 29

టీ. మృతియైనను=చచ్చిపోయినను, బ్రతుకైన=బ్రతికియున్నను, సతికి=ఆడుదానికి, పతితోడనె=మగనితోడనె, చెల్లున్=ఉండదగును, పతిబాసిన=మగనివిడచిన, ఆబ్రతుకు=ఆజీవితము, ఒకబ్రతుకా=ఒకజీవనమా ? (కాదు) ఎన్నన్=ఆలోచింపగా, ఇదియున్=ఈలాగునమగనివిడచి యుండుట, వధూటికిన్=స్త్రీకి, జీవన్మృతిగాక=బ్రతికియుండియు చనిపోయినటుగాక !

తా. ఎన్నికష్టములు కలిగినను ఆడుది భర్తను విడిచియుండక

గాదు, అటుల విడిచియున్న స్త్రీ బ్రతికియున్నను చచ్చినవారికి సే
జమ యగును.

క. మగని ప్రియ మబ్బెననుచును
దెగనీలిగి యింటివారి ♦ దిగఁద్రొక్కుచు దుం
డగురాలై తిరిగిన సరి
మగువలలో నిదియె తప్పు ♦ మాట కుమారీ. 30

టీ. చిన్నదానా! మగనిప్రియము=భర్తయొక్క ప్రేమ, అబ్బెననుచు=కలిగినదని, తెగనీలిగి=మిక్కిలి గర్వపడి, ఇంటి వారిని=ఇంటిలోనున్న వారిని, దిగఁద్రొక్కుచున్=తూలనాడుచు, దుండగురాలై=దుర్మార్గురాలై, తిరిగినన్=మెలగినేని, సరి మగువలలోన్=సాటిస్త్రీలలో, ఇదియె=ఇట్లు తిరుగుటయే, తప్పుమాట=చెడ్డమాట అగును.

తా. అమ్మాయీ! స్త్రీ మగనిప్రేమ గలదని అత్త మొదలగు యింటివారిని లక్ష్యము చేయక తిరిగినేనినిందనుపొందును.

క. జీవములు భర్తపదశా
జీవములని చిత్తమందుఁ ♦ జింతించిన ల
క్ష్మీవల్లభు చరణంబుల
సేవ లతాంగులకు నెమ్మిఁ ♦ జేయుఁ గుమారీ. 31

టీ. బిడ్డా! భర్త=మగనియొక్క, పదరాజీవములు=పాద పద్మములే, జీవములని=ప్రాణములని, చిత్తమందున్=తనమనస్సునందు, చింతించినన్=ఆలోచించినమొదల, లతాంగులకున్=స్త్రీలకు, లక్ష్మీవల్లభు చరణంబుల సేవ=లక్ష్మీదేవి భర్తయైన

క. తనకెంత మేలుచేసిన
మనసున కింపైన పనుల ♦ మసలిన దాసీ
వనితల కెన్నటికైనం
జనవిచ్చి మెలంగరాదు ♦ జగతిఁ గుమారీ. 35

టీ. అమ్మాయీ! జగతిన్=జగమునందు, తనకున్=తనకు ఎంతమేలు=ఎంతో ఉపకారము, చేసినన్=చేసినప్పటికిని, మనమునన్=మనస్సునందు, ఇంపైన పనులన్=ఇష్టమైనపనులందు, మసలినన్=నడచినను, దాసీవనితలకున్=పనులుచేయుస్త్రీలకు, ఎన్నటికైనన్=ఎప్పటికైనను, చనువిచ్చి=పెత్తనమునిచ్చి, మెలంగరాదు=నడువరాదు.

తా. అమ్మాయీ! దాసీలు ఎంతమేలుచేసినను, ఎంతయిష్టమైన పనులను చేసినను వారికి చనువీయరాదు.

క. కులదేవతలకు బెట్టిన
పోలుపునఁ దనయింటి యాఁడు ♦ బొట్టెల కెల్లం
గల మాత్రి యొసగకుండినఁ
గలఁత పొడము దాన మేలు ♦ గాదు కుమారీ. 36

టీ. కుమారీ! కులదేవతలకు=ఇంటిదేవతలకు, పెట్టినపోలుపున=పెట్టిన విధమున, తనయింటి, ఆడుబొట్టెలకెల్లన్=ఆడపడచులందరికిని, కలమాత్రము=తనయింట గలిగినమట్టుకు, ఒసగకుండినన్=ఇయ్యకుండిన, కలత=విచారము, పొడమున్=పుట్టును, దానన్ = అందువలన, మేలుగాదు=మంచిలేదు.

తా. కుమారీ! తన మగని తోబుట్టువులకు తనయింట

కలిగినంతమట్టుకు యివ్వవలెను. అలాగున యివ్వనియెడల వారు విచారించెదరు. దానివలన నష్టముగలదు.

క. బద్ధకము సంజనిద్దుర
వద్దుసుమీ దద్దిరంబు ♦ వచ్చును దానన్
గద్దింతు రింటివారలు
మొద్దందురు తోడివారు ♦ ముద్దుకుమారీ. 37

టీ. ముద్దుకుమారీ! బద్ధకము=పనిచేయుటకు యిష్టములేక పోవుటయు, సంజనిద్దుర = సాయంకాలము నిద్రపోవుటయు, వద్దుసుమీ=కూడదుసుమా! దానన్ = అందువలన, దద్దిరంబు= దరిద్రము, వచ్చును=కలుగును, ఇంటివారు=ఇంటిలోనున్న పెద్దలు, గద్దింతురు=కోపగింతురు, తోడివారు=స్నేహితురాండ్రు, మొద్దందురు=మొద్దు అనియెదరు.

తా. ముద్దుకుమారీ! పనిలేక యుండకుము. సంధ్యాకాలములందు నిదురింపకుము. అలాగున చేసినయెడల దోషము వచ్చును. పెద్దవారు కోపగింతురు. తోడివారు ఎగతాళి సేయుదురు.

క. ఇంటఁగలగుట్టు నీపొరు
గింట రవంతైనఁ దెలుప ♦ నేఁగకు దానం
గంటసపడి నీవారలు
గెంటించెద రిల్లు వెడలఁ ♦ గినుకఁ గుమారీ. 38

టీ. కుమారీ! ఇంటన్ = ఇంటియందు, కలగుట్టు=కలరహస్యమును, నీపొరుగింటన్ = నీప్రక్కయింటియందు, రవంతైనన్ = కొం

చెప్పినను, తెలుపక = చెప్పుటకు, ఏగకు = వెళ్ళకుము, దానక = అందువలన, నీవారలు = నీకు కావలసినవారు, కినుకన్ = కోపము చేత, ఇల్లువెడలక = ఇంట నుండుటకువీలు లేనటుల, గెంటింతురు = తోలివై చెదరు.

తా. కుమారీ! నీయింటి రహస్యములను పొరుగువారలకు చెప్పరాదు. అట్లు చెప్పితివేని నీయింటివారలు నీపై గోపించి యింటినుండి గెంటించెదరు.

క. వేకువజామున మేల్కని
పైకి వెడలివచ్చి ప్రాంచి ♦ పని దీర్పవలెన్
లేకున్నఁ దెల్లవారిన
లోకులు నవ్వుదురు సభల ♦ లోనఁ గుమారీ. 39

టీ. కుమారీ! వేకువజామున = తెల్లవారుజామున, మేల్కని = నిద్రనుండి లేచి, పైకివెడలివచ్చి = బయటికివచ్చి, ప్రాంచిపనిక = ప్రాంచిపనులను, తీర్పవలెక = పూర్తిచేయవలెను, లేకున్నక = అట్లు చేయనియెడల, తెల్లవారినక = తెల్లవారినట్లయిన, లోకులు = ప్రజలు, సభలలోక = సభలయందు, నవ్వుదురు = వెక్కిరింతురు.

తా. కుమారీ! తెల్లవారుజామున లేచి ప్రాంచిపనులు చేసికొననియెడల జనులు సభలలో ఎగతాళి చేయుదురు.

క. ఇక్కడి దక్కడ నక్కడి
దిక్కడఁ జెప్పినను వారి ♦ కిద్దఱికిఁ బగల్
పొక్కనఁ గలచేడియ ల

మ్మక్కా యిదుముళ్ళమారి ♦ యందుఱ్ఱు కుమారీ. 40

టీ. కుమారీ! ఇక్కడిది=వీరివద్దమాటను, అక్కడన్ = వారివద్దను, అక్కడిది = వారివద్దమాటను, ఇక్కడన్ = వీరి వద్దను, చెప్పినను= చెప్పినయెడల, వారికిద్దఱికిన్=వారికిద్దరికిని, పగల్=విరోధములు, పొక్కినన్=కలిగినట్లయిన, కలచేడియలు= మిగిలినస్త్రీలు, అమ్మక్కా=ఎంతపని! ఇదుముళ్ళమారి=కలహ ములు పెట్టినట్టిది, అందుఱ్ఱు=అందురు.

తా. కుమారీ! అక్కడి మాటలను ఇక్కడను, ఇక్కడ మాటలను అక్కడను చెప్పినయెడల వారిద్దఱికిని కలహము వచ్చును. నిన్ను జనులు కలహముపెట్టినదని నిందింతురు.

క. తలవాకిట నెల్లప్పుడు
నిలువఁగరా దెప్పు డెంత ♦ నిద్దురయైనన్
మెలఁకువ విడరాదు సుమీ
తల నడచుచు విప్పికొనుట ♦ తగదు కుమారీ. 41

టీ. కుమారీ! తలవాకిటన్=వీధివాకిట, ఎప్పుడున్=ఏవేళ ను, నిలువఁగరాదు=నిలువకూడదు, ఎప్పుడు=ఏవేళయైనను, ఎంతనిద్దురయైనన్=ఎంత నిద్రపట్టినను, మెలకువ= తెలివి, విడ రాదు సుమీ=విడువతగదు సుమా, నడచుచు, తలవిప్పికొను ట=తలవెండ్రుకలను విప్పుకొనుట, తగదు=కూడదు.

తా. కుమారీ! వీధివాకిటను నిలువకూడదు. ఎంతనిద్ర యైనను, మెలకువ తప్పరాదు. నడచునపుడు జడ, కొప్పు, ముడి మొదలగువానిని విప్పుకొనరాదు.

క. వారికి వీరికిఁ గలిగెను,
గోరినవస్తులు మాకుఁ ♦ గొదవాయెనటం
చూరక గుటకలు మ్రింగుట
నేరముగా దలపవలయు ♦ నెలఁతకుమారీ. 42

టీ. కుమారీ! నెలత=స్త్రీ, వారికివీరికి, కోరినవస్తువులు=ఇష్టమైనవస్తువులు, కలిగెను=దొరికినవి, మాకు గొదవాయెను=మాకు తక్కువైనవి, అటంచున్=అనియనుచు, ఊరక=కారణము లేకనే, గుటకలు=కోరికలు, వేయుట=పడుట, నేరముగాన్=తప్పుగా, తలపవలయున్=తలంచవలెను.

తా. కుమారీ! స్త్రీ, వారికినివీరికిని కోరిన వస్తువులు కలవు మాకులేవు అని ఆశపడుట తప్పుగా తలంపవలెను.

క. కొన్నాళ్ళు సుఖము కష్టము
కొన్నాళ్ళు భుజింపకున్నఁ ♦ గొఅగాదుసుమీ
పున్నపు దినముల వెన్నెల
యెన్నంగ నమాసలందు ♦ నిరులు కుమారీ. 43

టీ. కొన్నాళ్ళు=కొన్నిరోజులు, సుఖము=సౌఖ్యమును, కొన్నాళ్ళు=కొన్నిదినములు, కష్టము=బాధలును, (కలుగును) ఎన్నఁగన్=విచారింపగా, పున్నమదినములన్=పున్నపుదినములు వచ్చు శుక్లపక్షమునందు, వెన్నెల=వెన్నెలయును, అమాసలందున్ = అమావాస్యలవచ్చు బహుళపక్షపురోజులయందు, ఇరులు=చీకటులు, (కలుగును.)

తా. కుమారీ నెలలో సగము దినములు వెన్నెలయు,

కొన్నిదినములు చీకటులును, వచ్చునటులనే కొన్నాళ్ళు సుఖము కొన్నాళ్ళు కష్టమును గలుగును.

క. పొంతఁబని సేయకెన్నడుఁ
బంతంబులు పలుకఁ బోకు ♦ ప్రాఙ్ముఖముగ నీ
దంతంబులు దోమకు మే
కాంతంబులు బయలు పఱుప ♦ కమ్మ కుమారీ. 44

టీ. అమ్మా! కుమారీ! ఎన్నడుఁ=ఎప్పుడును, పొంతఁబని=ఉమ్మడికార్యమును, సేయకు=చేయకుము, పంతంబులు=పట్టుదలమాటలను, పలుకవద్దు=ఆడవద్దు, ప్రాఙ్ముఖముగ=తూర్పుదిక్కుగా(తిరిగి) నీదంతంబులు = నీపండ్లు, తోమకుము, ఏకాంతంబులు = రహస్యములయిన అవయవములను, బయలుపరుపకు=బయటకు కనబడనీయకుము.

తా. కుమారీ! ఉమ్మడిపనులనుచేయకుము, పట్టుదలమాటలను పలుకకుము. తూర్పుకెదురుగా పండ్లుతోమకుము. రహస్యములను బయటపడనీయకుము.

క. నడకలలో నడుగులచ
ప్పుడు వినఁబడ కుండవలయుఁ ♦ భువిగుంటలుకో
న్పడరాదు మడమలనొక్కులఁ
బడతుల మర్యాదలెఱిఁగి ♦ బ్రతుకు కుమారీ. 45

టీ. కుమారీ! నడకలలో=నడచునప్పుడు, అడుగుల=పాదముల, చప్పుడు=సందడి, వినబడకన్=వినబడకుండా, ఉండవలయు=ఉండవలెను, మడమలనొక్కులన్=మడమలనదిమినపుడగు

పడదడి, గుంటలు=గోతులు, కన్పడగరాదు=కానుపించరాదు, పడతుల=స్త్రీల, మర్యాదలు=నడకలరీతిని, ఎఱిగి=తెలిసికొని, బ్రతుకుము=సుఖింపుము.

తా. కుమారీ! స్త్రీనడుచునపుడు చప్పుడువినుపించరాదు. మడమలగోతులు కాన్పించరాదు. వీనినెఱిగినడుచుకొనవలెను.

క. నవ్వంగరాదు పలుమరు
నవ్వినఁజిఱునవ్వుగాని ♦ నగరాదెపుడున్
గవ్వలవలె దంతంబులు
జవ్వనఁగానంగఁబడెడి ♦ జాడఁగుమారీ. 46

టీ. కుమారీ! పలుమరు=మాటిమాటికిని, నవ్వంగరాదు=నవ్వగూడదు, నవ్వినన్=ఒకవేళనవ్వినను, చిఱునవ్వుగాని=పెదవులమీదనే నవ్వవలెనుగాని, గవ్వలవలె=గవ్వలరీతిని, దంతంబులు=పండ్లు, జవ్వన=కాంతితో, కానంగఁబడెడిజాడన్=కాన్పించునట్లుగా, ఎప్పుడున్=ఎప్పుడును, నగరాదు=నవ్వరాదు

తా. కుమారీ! స్త్రీఎన్నడును నవ్వరాదు. నవ్వినను చిఱునవ్వునవ్వవలెనుగాని గవ్వలవలె పండ్లిగిలించినవ్వరాదు.

క. తొడవులుమిక్కిలిగలిగినఁ
గడుఁబ్రేమన్ మగఁడుమిగుల ♦ గారామిడినన్
బడఁతుక పసుపుంగుంకుము
గడిదైననువిడువరాదు ♦ గాదెకుమారీ. 47

టీ. కుమారీ! తొడవులు=నగలు, మిక్కిలి=ఎక్కువగా, కలిగినన్=ఉన్నను, కడుప్రేమన్=మిక్కిలిప్రేమచేత, మగడు=భర్త,

గారవము=పేరు, ఇడినన్=ఇచ్చినను, పడతుక=స్త్రీ, పసుపున్=పసుపున్ను కుంకుమయున్ను, గడియైనను=ఒక్కగడియైనను, విడువరాదుగాదే=విడిచిపెట్టరాదుగదా!

తా. కుమారీ! ఎన్నినగలున్నను, మగని ప్రేమయున్నను, స్త్రీ పసుపును కుంకుమయును విడువరాదు,

క. చెడుగులతో లంజలతో
గుడిసేటులతోడఁబొత్తు ♦ కూడదు మదిని
ప్పుడు నిల నుత్తమకాంతల
యడుగులకున్మడుగులొత్తు ♦ మమ్మకుమారీ. 48

టీ. చెడుగులత్తో=చెడ్డవారితో, లంజలతో=జార స్త్రీలతో, గుడిసేటులతో=జారత్వమువలనజీవించు స్త్రీలతో, పొత్తు=స్నేహము, కూడదు=చేయరాదు, మదిన్=మనస్సునందు, ఎప్పుడున్=ఏవేళను, ఉత్తమకాంతల=పతివ్రతల, యడుగులకు=పాదములకు, మడుగులొత్తుము=సేవజేయుము.

తా. స్త్రీ చెడుకాంతలతో స్నేహమును చేయక పతివ్రతల సేవ చేయుచుండవలెను.

క. విసువకు పని తగిలినయెడఁ
గసరకు సేవకులమిగులఁ ♦ గాంతునితోడన్
రొసరొస పూనకు మాటకు
మసత్యవచనంబు లెన్నఁ ♦ డైనఁగుమారీ. 49

టీ. కుమారీ! ఎన్నడైనన్=ఎప్పుడైనను, పని దగిలినఎడ=పని చేయవలసివచ్చినయెడల, విసువకు=విసుగకుము, సేవకుల=బా

నిసల, మిక్కిలి=అధికముగా, కసరకు=కోపగింపకుము, కాంతుని తోడన్=భర్తతోడ, రొసరొసపూనకు=కలహించకు, అసత్య వచనంబులు=అబద్ధపుమాటలను, ఆడకుము=పలుకకుము.

తా, కుమారీ! పనిచేయవలసినయెడల విసగకుము బానిస లతిట్టకుము భర్తతోకలవాంచకుము అబద్ధము లాడకుము.

క. వేళాకోళంబులు గ
య్యాళితనంబులును జగడ ♦ మాడుటలును గం
గాళీపోకలు గొండెము
లాలోచించుటయుఁ గూడ ♦ దమ్మకుమారీ. 50

టీ. అమ్మకుమారీ! వేళాకోళంబులు = హాస్యములును, గయ్యాళితనంబులును= పెంకెతనము, జగడమాడుటలు=కల హించుటలును, కంగాళీపోకలు=తప్పునడకలు, కొండెములా లోచించుటలు=కీడుచేయుటకై ఆలోచించుటలును, కూడదు= తగదు.

తా. కుమారీ! హాస్యములును, పెంకెతనమును, కలహించు టలును, తప్పునడకలును, ఒకరికికీడుచేయుటకై ఆలోచించుట లును కూడదు.

క. బంతులను బక్షపాత ము
కింతైనను జేయరాదు ♦ హీనదశుల సా
మంతుల నొకభంగి నిరీ
క్షింతురు బుధులెల్ల సంత ♦ సిల్లఁగుమారీ. 51

టీ. కుమారీ! బంతులను=భోజనముపెట్టెడివరుసలందు, పక్ష

పాతము=ఒకరికి యెక్కువ ఒకరికి తక్కువగ నుంచుట, ఒకింతైనను=కొంచెమైనను, చేయరాదు=చేయఁతగదు, హీనదశులన్=ధనములేనివారిని, సామంతులను=ధనమున్నవారిని, బుధులు=గొప్పవారు, ఎల్లన్=అందరును, సంతసిల్లన్=సంతోషించుటకుల, ఒకభంగిన్=ఒకరీతిగా, నిరీక్షింతురు=చూచెదరు.

తా. కుమారీ! భోజనముపెట్టినయెడల ఒకరికియెక్కువగను మరియొకనికి తక్కువగను పెట్టక బీదవారిని, భాగ్యవంతులను ఒకరీతినిచూచినయెడల పెద్దలు సంతసింతురు.

క. మాసినతల మాసినయిలు
మాసిన వలువలు దరిద్ర♦ మార్గంబులు నెం
తేసి ధనవంతులైనను
గాసిల్లుదు రల్పదశలఁ♦ గాఁగకుమారీ. 52

టీ. కుమారీ! మాసినతల=మన్నుపట్టినతలయును, మాసినయిలు=మన్నుపట్టినయిల్లును, మాసినవలువలు=మన్నుపట్టినబట్టలును, దరిద్రమార్గంబులు=దరిద్రమువచ్చుటకుత్రోవలు, ఎంతేసిధనవంతులైనను=ఎంతధనముకలవారైనను, అల్పదశలన్=నీచగతులచేత దుఃఖించి, గాసిల్లుదురు=కష్టములనుపొందుదురు.

తా. కుమారీ! మన్నుపట్టినతలయు,యిల్లును, బట్టలును, దరిద్రమువచ్చుటకు త్రోవలు, వీటివలన యెంతధనముకలవారైనను ధనముపోయి దుఃఖించును.

క. సన్నేకలుం బొత్రిమ్మను
దన్నకపోరాదు కాలఁ♦ దగిలినయెడలన్

గన్నుల నద్దుకొనవలెఁ
గ్రిన్నన సిరియుండునిలుచుఁ ♦ గాదె కుమారీ. 53

టీ. కుమారీ! సన్నికలున్=సన్నికల్లును, పాత్రమ్మును=పాత్రమును, తన్నకపోరాదు=తన్ని వెడలరాదు, కాలదగిలిన యెడలన్=ఒకవేళ కాళ్లకుతగిలినను, కన్నులన్=కన్నులను, క్రిన్నన్ శీఘ్రముగా, అద్దుకొనవలెన్=అదుముకొనవలెను, అందు=ఆసన్నికల్లునందును, పాత్రమునందును, సిరి=లక్ష్మీదేవి, నిలుచు గాదె=ఉండునుగదా!

తా. కుమారీ! సన్నికల్లునందును, పాత్రమునందును లక్ష్మీదేవియుండునుగాన వాటినికాలితోతన్నరాదు. ఒకవేళ కాలున కుతగిలినను కన్నులనద్దుకొనవలెను.

క. దీపము వెలిఁగించెడిచోఁ
జీపురుపుడ కుంపవలయుఁ ♦ జేతుల నేతం
బాపముపా లౌదువు మది
లోపల నిది తలపవలయు ♦ రూఢిఁగుమారీ. 54

టీ. కుమారీ! దీపము వెలిగించెడిచో=దీపమునుముట్టించు చోట, చీపురుపుడకన్=చీపురుపుల్లను, ఉంపవలెన్=ఉంచవలెను, చేతులన్=చేతులనంటుకొన్న, నేతన్=సమరమున, పాపము పాలు=పాపమునకుఆధీనము, ఔదువు=అగుదువు, ఇది=ఈసంగతి, మదిలోపల=మనస్సునందు, రూఢిన్=నిజముగా తలప వలయు=తలంపవలెను

తా. కుమారీ! దీపము వెలిగించి వత్తినియెత్తుటకు చీపురు

పుడకను ఉంచవలెను. అలాగుఉంచక నీచేతితో ఎత్తితీసిన చము రు నీచేతికిఅంటుకొనును, ఆచమురువలన పాపమునకు ఆస్పదము అగును.

క. సరకులయెడ జాగ్రత్తయుఁ
జురుకుపనులయందు భక్తి ♦ సుజనులయందున్
గరుణ యనాథులయెడలం
దరుణికిఁ జెలువారవలయు ♦ ధరణిఁ గుమారీ. 55

టీ. కుమారీ! సరకులయెడన్=వస్తువులయందు, జాగ్రత్త యున్=శ్రద్ధయు, పనులయందున్=కార్యములయందు, చురు కు=వేగమును, సుజనులయందున్=మంచివారియందు, భక్తి= ప్రేమయును, అనాథులయెడన్=దిక్కులేనివారియందు, కరుణ= ప్రీతియును, ధరణిన్=భూమియందు, తరుణికిన్=స్త్రీకి, చెలువార వలయు=ఉండవలెను.

తా. కుమారీ! ఇంటిలోనున్న వస్తువులయందు జాగ్రత్తయు న్నూ, పనులయందు వేగమును, పెద్దలయందుభక్తియును, దిక్కులేనివారియందు దయయును, ఉండవలెను.

క. చెప్పిన జెప్పక యుండినఁ
దప్పక సేయంగవలయుఁ ♦ దనపనులెల్లన్
మెప్పొదవఁగాను లేదా
ముప్పొదవును గాదెయుందు ♦ ముద్దుకుమారీ. 56

టీ. ముద్దుకుమారీ! చెప్పినన్=పెద్దలుచెప్పినను, చెప్పక యుండినన్=చెప్పకపోయినను, తనపనులెల్లన్=తనయింటనున్న

పనులన్నిటిని, మెప్పొదవగాను=అందరును మెచ్చుకొనునట్లు, తప్పక=విడువక, సేయంగవలయు=చేయవలెను, లేదా=అలాగుచేయనియెడల, ఎందు=ఎచ్చటనైనను, ముప్పు=కీడు, ఒదవును గాదె=వచ్చునుగదా.

తా. కుమారీ! పెద్దలుచెప్పినను, చెప్పకపోయినను తనపనులను జనులుమెచ్చుకొనునట్లు చేయవలెను. అలాగుచేయనియెడల కీడువచ్చును.

క. ఎంగిలి పరులకుఁ బెట్టకు
కంగున మోఁయంగనీకు ♦ కాల్మట్టియలన్
బంగారులాభ ముండిన
దొంగతనము సేయుబుద్ధిఁ ♦ దొలఁగు కుమారీ. 57

టీ. కుమారీ! పరులకు=ఇతరులకు, ఎంగిలిన్=తినగా మిగిలినదానిని, పెట్టకు=ఇయ్యకు, కాల్మట్టియలన్=కాలిమట్టెలు, కంగున ఖంగుమనునటుల, మోయంగనీయకుము=చప్పుడుకానీయకుము, బంగారులాభముండినన్=బంగారముదొరకినను, దొంగతనము సేయుబుద్ధిన్ = దొంగలించుమనస్సును, దొలచు=విడువుము.

తా. కుమారీతినగామిగిలిన అన్నమును యితరులకు పెట్టకుము. కాలిమట్టెలు చప్పుడగునటుల నడువకుము. బంగారము దొరకినను దొంగబుద్ధిని విడువుము.

క. ఆపదల కోర్చి సంపదఁ
లాపయి భోగించుననెడు ♦ హర్షోక్తులనీ

లోపలఁ దలఁచుచు లాంతరు
దీపముచందమున వెలుఁగఁ ♦ దివురు కుమారీ. 58

టీ. కుమారీ! ఆపదలకున్=కష్టములకు, ఓర్చి=భరించి, ఆప యిన్=అవిమీఁద, సంపదలు=సౌఖ్యములను, భోగింతువు=అనుభవించును, అనెడి=అనునట్టి, హర్షోక్తులన్=సంతోషపుపలుకులు, నీలోపలన్=నీమనస్సునందు, తలఁచుచున్=తలంచుచు, లాంతరు దీపముచందమునన్=లాంతరులోని దీపమువలె, వెలుఁగన్=ప్రకాశించుటకు, దివురు=కోరుము.

తా. కుమారీ! కష్టములను భరించినయెడల సుఖముకలుగును అనుమాటను తెలుసుకొని లాంతరులో దీపమువలె కదలక మెదలక ప్రకాశించుము.

క. తనకడుపు కట్టుకొనినదై
నను జుట్టమునకును బెట్టి ♦ నను గీర్తి వహిం
చును భుక్తిముక్తు లబ్బును
దనకెవ్వరు సాటిరారు ♦ ధరణిఁ గుమారీ. 59

టీ. కుమారీ! తనకడుపుకట్టుకొనినదైనన్=తనపొట్టకుతిండి మానినదైనను, చుట్టమునకు=బంధువునకు, పెట్టినను=పెట్టినయెడల, కీర్తి=కీర్తిని, వహించును=పొందును, భుక్తిముక్తులు=భోజనమును, మోక్షమును, అబ్బును=వచ్చును, ధరణిన్=భూమియందు, తనకున్=తనకు, ఎవ్వరున్=ఎవ్వరును, సాటిరారు=సమానులుకారు.

తా. కుమారీ! తానుతిండి మానినదైనను చుట్టమునకు పెట్టి

నేని కీర్తి వచ్చును. అందరిలోను అధికతవచ్చును.

క. వడిదనుపించు కొనుటకున్
గడెయైనను బట్టకుండుఁ ♦ గాంతలలో నె
క్కుడుగుణవతి యనిపించెడి
నడవడి నేర్చుటయె కడుఘ ♦ నంబు కుమారీ. 60

టీ. కుమారీ! వడిదనుపించుకొనుటకున్ = గయ్యాళిఅని అనిపించుకొనుటకు, గడియైనన్-గడియ సేపైనను పట్టకుండుము, కాంతలలో=ఆడువారిలో, ఎక్కుడుగుణవతి=మిక్కిలిమంచిగుణములుగలది, అనిపించెడినడవడి=అనిపించెడి ప్రవర్తన, నేర్చుటయె=నేర్చుకొనుటయె, కడుఘనంబు=మిక్కిలిగొప్పదనము.

తా. కుమారీ! గయ్యాళీఅని అనుపించుకొనుటకు గడియైనను అక్కరలేదు. మంచిగుణములను నేర్చుకొనుటయే గొప్ప కార్యము.

క. చెప్పకు చేసినమేలు నొ
కప్పుడైనఁ గానిదాని ♦ హర్షింపరుగా
గొప్పలు చెప్పిన నదియును
దప్పేయని చిత్తమందుఁ ♦ దలపు కుమారీ. 61

టీ. కుమారీ! చేసినమేలు=నీవు ఇతరులకు చేసిన ఉపకారమును, ఒకప్పుడైనన్=ఒకసమయమందైనను, చెప్పకు=ఇతరులతో అనకుము, దానిన్=ఆలాగునచెప్పటను, హర్షింపరుగా=గొప్పపనియనరుకదా, గొప్పలు=అధికములు, చెప్పినన్=చెప్పినయెడల, అదియును=అట్లుచెప్పకొనుటయును, తప్పేయని=

నింద యేల అని, చిత్తమందున్=మనస్సునందు, తలఁపున్=ఎంచుము.

తా. కుమారీ! నొకరికి చేసిన మేలును తనగొప్పతనమును ఇతరులతో చెప్పుకొనుటతప్పు, దానిని పెద్దలు మెచ్చుకొనరు. దీనిని మనస్సునందు మఱువరాదు.

క. ఎంతటి యాఁకలి కలిగిన
బంతినిగూర్చుండి ముందు ♦ భక్షింపకు సా
మంతులు బంధువులును విసు
మంతైనను జెల్లదందు ♦ రమ్మ కుమారీ. 62

టీ. అమ్మకుమారీ! ఎంతటియాఁకలి=ఎంతఆకలిని, కలిగినన్=కలిగియున్నను, బంతిని=అందరును తినుచుండుచోట, కూర్చుండి=కూర్చొని, ముందు=వారందరికంటెముందుగా, భక్షింపకుమి=తినవద్దుసుమీ, సామంతులు=గౌరవనీయులును, బంధువులును=చుట్టములును, ఇసుమంతైనను = కొంచెమైనను, తగదందురు=ఇట్టిపనితగదందురు.

తా. కుమారీ! స్త్రీ పెద్దలకంటె ముందుగా భోజనముచేయుట తగదు అటులచేసినయెడల జనులు నిందింతురు.

క. అధికారములేని పనుల
కధికారము సేయంబోకు ♦ మందునగోపం
బధికంబగు నీ వారికి
బుధులది విని హర్షమొందఁ ♦ బోరు కుమారీ. 63

టీ. కుమారీ! అధికారములేనిపనులన్=నీకుహక్కులేనిపనులయందు, అధికారము=ఆజ్ఞలను, చేయుబోకు=చేయువద్దు, అందు

నన్ = అట్టిఅధికారము చేయుటచేత, నీవారికిన్ = అత్త మొదలైన వారికి, కోపంబు = కోపము, అధికంబగున్ = ఎక్కువయగును, బుధులు = పెద్దలు, అది = ఆపనని, విని = ఆలకించి, హర్షము = సంతోషమును, పొందబోరు = పొందరు.

తా. కుమారీ! నీకుఅధికారములేని పనులయందు అధికారముకలిగించుకొనినయెడల నీవారికి నీపై కోపమువచ్చును. ఇట్టి పనిని పెద్దలు సంతోషించరు.

క. తా నమ్ముడు వడినైనన్
దీనుం డగుధవునియార్తిఁ ♦ దీర్చుట సతికిన్
మానము చంద్రమతీజల
జాననఁ దలపోయువలయు ♦ నాత్మఁ గుమారీ. 64

టీ. కుమారీ! తాన్ = దాను, అమ్ముడువడినైనను = అమ్మకమునుపొందినైనను, దీనుండగు = ధనములేనివాడగు, ధవుని ఆర్తి = భర్తదుఃఖమును, తీర్చుట = పోగొట్టుట, సతికిన్ = మంచిగుణములుగలస్త్రీకి, మానము = మర్యాదఅగును, చంద్రమతీజలజాననన్ = చందమతీదేవిని, ఆత్మన్ = మనస్సునందు, తలపోయువలయున్ = ఎంచవలెను,

తా. కుమారీ! మంచిగుణములుగల స్త్రీ తాను ఇతరులకు అమ్ముడుపడినైనను భర్తదుఃఖమును తీర్చుట ధర్మము. చంద్రమతీదేవి తాను అమ్ముడుపడి భర్తరుణమును తీర్చెను.

క. తనకంటెఁ పేదరాండ్రం
గని యెంతకుఁ దనకుమేలు ♦ గా యనవలయున్

దనగుంటె భాగ్యవంతులఁ
గని గుటకలుమ్రింగ మేలు ♦ గాదుకుమారీ. 65

టీ. కుమారీ! తనకంటెన్ = తనకంటె, పేదవాండ్రిన్ = బీద వారిని, కని = చూచి, అంతకున్ = వారికంటె, తనకున్ = తనకు, మేలుగా = మేలుకదా, అనవలయున్ = అనియెంచుకొనవలయును, తనకంటెన్ = తనకుమిక్కిలి, భాగ్యవంతులన్ = ధనముకల వారిని, కని = చూచి, గుటకలుమ్రింగన్ = ఆశపడుట మేలుకాదు = సుఖముకాదు.

తా. కుమారీ! తనకంటె బీదవారినిచూచి అంతకంటె ధనముకల దానవని సంతోషింపవలయును. కాని తనకంటె భాగ్యవంతులచూచి ఆశపడుట దుఃఖమునకు కారణము.

క. విరుగఁ బడి నడువఁ గూడదు
పరులనడక లెన్నితప్పు ♦ పట్టఁ జనదు ని
ష్ఠురములు వచింపఁ గూడదు
కఱపగవలె మేలుమేలు ♦ గలదు కుమారీ 66

టీ. కుమారీ! విరుగపడి = గర్వపడి, నడువకూడదు = నడుచుటతగదు, పరులనడకలు = ఇతరులప్రవర్తనలను, ఎన్ని = ఎంచి, తప్పుపట్టన్ = తప్పుతీయుట, చనదు = కూడదు, నిష్ఠురములు = నిందమాటలను, వచింపకూడదు = అనరాదు, మేలు = మంచివి, కఱపగవలెన్ = బోధించవలెను, మేలుకలదు = తనకుమంచియగును.

తా. కుమారీ! గర్వపడినడువరాదు. పైవారలనడకలయందుతప్పులు పట్టకూడదు. కష్టముగా మాటలాడగూడదు. ఇతరు

లకు మంచిచెప్పవలెను. అట్లుచెప్పినయెడల తనకు మంచి కలుగును.

క. కోపమున నప్పుడాడని
రూపించినమాట కొన్ని ♦ రోజులుచనినన్
జూపెట్టుదునని శాంతము
లోపలఁ గొనవలయు ధర్మ ♦ లోలకుమారీ. 67

టీ. కుమారీ! ధర్మలోలక్ = ధర్మమునందు ఆసక్తి,కల కోపమునన్=కోపముచేత, అప్పుడు=కోపమువచ్చినసమయమునందు ఆడనిరూపించినమాట = చెప్పుటకుతలచినమాటను, కొన్నిరోజులు=కొన్నిదినములు, చనినన్=పోయినపిదప, చూపెట్టెదన్ అని= తెలియజేసెదనని, లోపలక్=మనస్సునందు, శాంతము= ఓరిమిని, కానవలయుక్=పొందవలెను.

తా. కుమారీ! కోపముకలిగినప్పుడు అనదలచిన మాటను అపుడు అనక ఓర్పును పొందవలెను.

క. కలహాపదునింట నిలువదు
కలుములజవరాలు కానఁ ♦ గలకాలంబే
కలహములులేక సమ్మతి
మెలఁగంగానేర్చెనేని ♦ మేలుకుమారీ. 68

టీ. కుమారీ! కలుములుజవరాలు=లక్ష్మిదేవి, కలహాపదునింటక్ = పోట్లాడుచున్నయింటియందు, నిలువదు = ఉండదు, కానక్=కావున, కలకాలంబు=ఎల్లకాలము, ఏకలహములేక= ఎట్టిపోరునులేక, సమ్మతిక్=ఇష్టముగా, మెలగంగాక్=తిరుగుట

కు, నేర్పునేని= నేర్చుకొనినయెడల మేలు=సుఖము.

తా. కుమారీ! ఎల్లప్పుడును వాదులాడుచున్న ఇంట లక్ష్మీదేవి ఉండదు. కాబట్టి కలహములేక ఉండవలెను.

క. గురుశుక్రవారముల మం
దిర గేహళులందు లక్ష్మి ♦ తిరముగ నిలుచున్
గరగరికన్ నలికి ముగ్గిడి
గురుభక్తి మెలంగఁ బాయుఁ ♦ గొదువ కుమారీ. 69

టీ. కుమారీ! గురుశుక్రవారములన్=గురువారమునందును శుక్రవారమునందును, మందిర=యిండ్లయొక్క, గేహళులందున్=గడపలయందు, లక్ష్మి=లక్ష్మీదేవి, తిరముగా=శాశ్వతముగా, నిలుచున్=ఉండును, గరగరికన్ = మిక్కిలిబాగుగా, అలికి=కడిగి, ముగ్గిడి=ముగ్గుపెట్టి, గురుభక్తితోన్ = పెద్దలయందు ప్రేమతో, మెలగన్=తిరుగగా, కొదువ=లేమి, పాయున్=పోవును.

తా. గురువారమునందును శుక్రవారమునందును లక్ష్మీదేవి ఇంటి కడపను కాపురముండును. కాబట్టి అలికిముగ్గుపెట్టి పెద్దలయందు భక్తికలిగి ఉండినయెడల దరిద్రముపోవును.

క. అపకీర్తిం బొందుట క
ష్టపుఁ బనిగా దొక్కగఁజియ ♦ చాలును గీర్తిన్
నిపుణతవహింప వలయును
జపలగుణములెల్లఁ బాసి ♦ చనఁగఁ గుమారీ. 70

టీ. కుమారీ! అపకీర్తిన్ = చెడ్డవాడుకను, పొందుట=చెందు

ట, కష్టపుపనిగాదు = కఠినమైనకార్యముకాదు, ఒక్కఘడియ చాలునుఁ-దానికిఒకఘడియకాలముచాలును, చపలగుణములు= నిలకడలేనిగుణములు. అన్నియుఁ=అన్నిటిని, పాసిచనఁగ= విడిచివెడలునట్టు, కీర్తిఁ=మంచిఖ్యాతిని, నేర్పుతోఁ=నేర్పరితనముతో, వహింపవలయును=పొందవలయును.

తా. కుమారీ! చెడ్డవాడుకను పో[illegible]టసు[illegible] పని నిలకడలేని గుణమును విడచి కీర్తి[illegible]దించవలెను.

క. సరకులు బట్టలు వన్నెల
కెరవులు తేఁ దగదు తెచ్చె ♦ నేని సరకుల
క్కఱ దీర్చుకొనుచు వెంటనే
మరలింపకయున్నఁ దప్పు ♦ మాట కుమారీ. 71

టీ. కుమారీ! సరకులు=నగలును, బట్టలు=చీరలుమొదలగు దుస్తులు, వన్నెలకున్=అందమునకై, ఎరవులు=ఎరువులుగా, తేదగదు=తేరాదు, తెచ్చెనేని=అలాగుతెచ్చినయెడల, సరకులు= నగలు, అక్కర=అవసరము, తీర్చుకొని = పూర్తిచేసుకొని, వెంటనే=అప్పుడే, మరలింపకయున్నన్=ఇచ్చివేయకున్నయెడల, తప్పుమాట=చెడ్డమాటకలుగును.

తా. కుమారీ! నగలు చీరలు అందమునకై ఎరువుతెచ్చు కొనరాదు. అలాగుతెచ్చినయెడల అవసరముతీర్చుకొని వెంట నేయిచ్చివేయవలెను. అటుల యివ్వనియెడల అపకీర్తివచ్చును.

క. గొప్పదశ వచ్చెననుచు నొ
కప్పుడయిన గర్వపడుచు ♦ మదిదొలఁగిన చోఁ

చప్పట్లు చఱతు రందఱుఁ
తప్పని దండించు దండ ♦ ధరుఁడు కుమారీ. 72

టీ. కుమారీ! గొప్పదశ=మిక్కిలి యైశ్వర్యము, వచ్చెనను చున్=కలిగెనని, ఒకప్పుడైనన్=ఒక వేళయందైనను, గర్వపడ కుము=విఱ్ఱవీగకుము, అది తొలగిన చో=ఆసంపద పోయిన యెడల, అందఱున్=జనులందరు, చప్పట్లుచఱతురు=చేతులుతట్టి హేళనచే యుదురు, దండధరుడు=యమధర్మరాజు, తప్పుఅని=గర్వమును పొందుట దోషమను నెపమున, దండించున్=శిక్షించును.

తా. కుమారీ! సంపదగలదని గర్వపడరాదు. ఆసంపద చెడి పోయినమీాదట జనులు నిన్ను పరిహాసింతురు. గర్వపడుట తప్పని యమధర్మరాజు నిన్ను శిక్షించును.

క. సుమతియును చంద్రమతియును
దమయంతియు జానకియును ♦ ద్రౌపతియును బ
న్నములం బడి పతిభక్తిం
గ్రమమున నడపుటలు తలఁప ♦ గాదె కుమారీ. 73

టీ. కుమారీ! సుమతియును=సుమతియను పేరుగల పతివ్రతయు, చంద్రమతియు = చంద్రమతియును, దమయంతియు= దమయంతియును, జానకియును = సీతాదేవియును, ద్రౌపతి= ద్రౌపతియును, బన్నములన్=కష్టములను, పడి=పొంది, పతి భక్తి=భర్తయందలి ప్రేమను, క్రమమునన్ = తెంపులేనటుల, నడపుటలు=చేయుటలు, తలఁపవలదే=ఆలోచింపవలదా?

తా. కుమారీ! పూర్వము సుమతియు, చంద్రమతియు,

దమయంతియు, సీతయు, ద్రౌపదియు మిక్కిలి కష్టములపడి యైనను పతిభక్తిని చూపుట సెఱుగుము.

క. సుమతియను రమణి పతికై
శ్రమనొందుట నీచసేవ ♦ సలుపుటయు వియ
ద్గమననిరోధము భానున
కమరించుటయుం దలంపు ♦ మాత్మఁ గుమారీ. 74

టీ. కుమారీ! సుమతియను=సుమతియనే పేరుగల, రమణి=పతివ్రత, పతికై=భర్తకొఱకు, శ్రమనొందుట=కష్టపడుటయును, నీచసేవ=నీచులకొలువు, సలుపుటయును=చేయుటయు, భానునకున్=సూర్యునకు, వియద్గమన=ఆకాశప్రయాణముయొక్క, నిరోధము=అడ్డము, అమరించుటయున్=చేయుటయును, ఆత్మన్=బుద్ధియందు, తలంపుము=తలచుకొనుము.

తా. కుమారీ! పూర్వము సుమతియను పతివ్రత తనభర్తకొఱకు నీచులను కొలిచి భర్త చనిపోవు దినమున సూర్యుని అస్తమింపకుండ జేసినే ఆపతివ్రతా ప్రభావమును మనస్సున తలంచుము.

క. వాణియు శర్వాణియు హరి
రాణియు వాక్కనను మైను ♦ రంబున నుంటల్
రాణఁ దిలకించి మదిలోఁ
బాణిగ్రాహియెడ నిల్పు ♦ భక్తి కుమారీ. 75

టీ. కుమారీ! వాణియున్=సరస్వతీదేవియు, శర్వాణియు=పార్వతీదేవియు, హరిరాణియున్=లక్ష్మీదేవియు, వాక్కనను=

ముఖమునందును మైన్=సగముశరీరమునందును, ఉరంబునన్=గుండెలమీఁదను, ఉంటల్=ఉంచుటలను, మదిలోన్=మనస్సునందు, రాణన్=ప్రేమతో, తిలకించి=చూచి, పాణిగ్రహీ యెడనే=భర్తయందు, భక్తిన్=ప్రేమను, నిల్పుము=ఉంచుము.

తా. కుమారీ! సరస్వతీదేవి మగని ముఖమునందును, పార్వతీదేవి మగని సగము శరీరమందును, లక్ష్మీదేవి మగని గుండెలమీఁదను విడువక ఉంచుకటుల ప్రేమతో మగని విడువక స్త్రీలు ఉండవలెను.

క. వడ్డించునపుడు తాఁ గను
బిడ్డనికిం దల్లిభంగిఁ • బ్రేముదలిర్పన్
వడ్డింపవలయుఁ భర్తకు
నెడ్డెతనము మానవలయు • నెందుఁ గుమారీ. 76

టీ. కుమారీ! వడ్డించునపుడు=భర్తకు భోజనము పెట్టునపుడు, తాగను బిడ్డనకున్=తనపిల్లకు, తల్లిభంగిన్=తల్లివలెనే, ప్రేముదలిర్పన్=అభిమానముఁ అధికమగునట్లుగా, భర్తకున్=మగనికి, వడ్డింపవలయును=పెట్టవలయును, ఎయందున్=ఏపనియందును, యెడ్డెతనము=మోటతనము, మానవలయును=విడువవలయును.

తా. మగనికి భోజనము పెట్టునపుడు తల్లిపిల్లకు పెట్టినట్టే ప్రేమతో పెట్టవలెను. ఏపనియందు మోటతనము పొందరాదు.

క. పవళించునపుడు రంభా
కువలయ దళనేత్రభంగిఁ • గోరినరీతిన్
ధవుని కొనఁగూర్పవలయును

దివి భువి నుతిఁ బొందునట్టి ♦ తెఱవ కుమారీ. 77

టీ. కుమారీ! పవళించునప్పుడు = పడక వేళయందు, రంభా ద్యుపలయుదళ నేత్రభంగిన్ = రంభ యను దేవతలు సానివలె, కోరిన రీతిన్ = కోరినటుల, ధవునికి = మగనికి, సౌఖ్యములను = సౌఖ్యమును యియ్యవలయును, అట్టి తెరవక = అటువంటిఆడుది, దివిన్ = స్వర్గమునందును, భువిన్ = భూమియందును, నుతిన్ = మెప్పును, పొందున్ = పొందును.

తా. కుమారీ! పడక సమయమందు రంభయను దేవతలను సానివలె మిక్కిలి ప్రేమగలిగి భర్త కోరిన సౌఖ్యమును యియ్యవలెను. అట్టి స్త్రీ భూలోకమునందును స్వర్గలోకమునందును కీర్తి పొందును.

క. ఆలోచన యొనరించెడి
వేళలలో మంత్రిభంగి ♦ వివరింపవలెం
గాలోచిత కృత్యంబులు
భూలోకమునందుఁ గీర్తిఁ ♦ బొందుఁ గుమారీ. 78

టీ. కుమారీ! ఆలోచనయొనరించెడి వేళలలో = ఆలోచన చేయునట్టి కాలమునందు, మంత్రిభంగిన్ = మంత్రివలె, కాలోచితకృత్యంబులన్ = కాలమునకు తగినపనులయందు, వివరింపవలెన్ = ఏర్పరచి చెప్పవలెను, భూలోకమునందున్ = భూలోకమునందు, మెప్పున్ = కీర్తిని, పొందున్ = పొందును.

తా. కుమారీ! భర్తకు ఆలోచనచెప్పునపుడు మంత్రివలె ఆయావేళలకుతగినపనులనుచక్కగాచెప్పుచూకీర్తినిపొందవలెను.

క. పనిసేయునపుడు దాసీ
వనిత విధంబునను మేను ♦ వంపఁగవలయుఁ
ధనవంతుల సుతయైనను
ఘనత గలుగు దానివలనఁ ♦ గాదె కుమారీ. 79

టీ. కుమారీ! పనిచేయునపుడు=పనులుచేయు కాలమున, దాసీవనిత విధంబునను=పనికత్తెవలె, మేను=శరీరమును, వంపగవలయుఁ=వంపవలయును, ధనవంతుల సుతయైనను=ధనముగలవారి కుమార్తె అయినను, ఘనత=గౌరవము, దానివలన గాదె=అట్లు పనిచేయుటచేతనే గదా కలుగును.

తా. కుమారీ! పనిచేయునపుడు సోమరితనము మాని పూడికపుకత్తెవలె తాను యెంతటి భాగ్యవంతుల పిల్లయైనను పనిచేయవలెను. అట్లు పనిచేయుట మంచిపేరు వచ్చును.

క. దానములు ధర్మకార్యము
లూనంగాఁ గలిగినంత ♦ యుక్తక్రియలన్
మానవతుల కిది ధర్మము
గా నెఱిఁగి యొనర్పవలయుఁ ♦ గాదె కుమారీ. 80

టీ. కుమారీ! దానములు=యితరులకు ధనము మొదలగునవి యిచ్చుటయును, ధర్మకార్యములు=నోములు మొదలగునవి చేయుటయును. పూనంగాన్=తాను చేయుటకు, కలిగినంత=సాధ్యమైనంత, యుక్తక్రియలన్ = మంచిపనులున్నూ, ఇది=ఇట్టిది, మానవతులకున్ = గౌరవముగల స్త్రీలకు, ధర్మముగాన్=న్యాయముగా, యెరిగి=తెలిసికొని, ఒనర్పవలయును

గాన్ = చేయవలయును.

తా. కుమారీ! స్త్రీలకు దానముచేయుట, నోములుచేయుట ఆచారము కలిగియుండుట ధర్మములు. వీని నెఱిగి చేయుచుండ వలయును

క. శ్రమ యెంత సంభవించిన
క్షమ మఱవఁగ రాదు ధరణి ♦ చందంబున స
త్యమునఁ బ్రవర్తించిన యా
రమణియె లోకంబునందు ♦ రమణి కుమారీ. 81

టీ. కుమారీ! శ్రమ=కష్టము, ఎంతసంభవించిన=ఎంత కలిగినను, ధరణిచందంబునన్=భూదేవివలెనే, క్షమ = ఓర్పును, మఱవగరాదు=మరచిపోవరాదు, సత్యమున్ = నిజముతో ప్రవర్తించిన యారమణియె=మెలగినయాఆడుదియె, లోకమునందున్=జనులయందు, రమణి=పతివ్రతయైన స్త్రీ.

తా. కుమారీ! భూదేవివలె ఓర్పుగలిగి కష్టములను ఓర్చిన ఆడుదియె కీర్తికలది యగును.

క. ఈరీతిఁ దిరుగ నేర్చిన
నారీమణి కీర్తిఁ బొందు ♦ నరలోకమునన్
దూరులు తొలంగిపోవును
ఘోరదురిత సంఘమెల్లఁ గుందుఁ గుమారీ. 82

టీ. కుమారీ! ఈరీతిన్=ఈత్రోవను, తిరుగ నేర్చిన=నడువ నెఱిగిన, నారీమణి=నేర్పుగలస్త్రీ, కీర్తిన్=మంచివాడుకను, బొందున్=పొందును, నరలోకములోన్=ఈభూలోకమునందు, దూ

రులు=నిందలు, తొలంగిపోవును=విడిచిపోవును, ఘోర=భయంకరమైన, దురిత=పాపముల యొక్క, సంఘము=సముదాయము ఎల్ల=అన్నియును, కుంచున్=నాశనమగును.

తా. కుమారీ! నేను చెప్పినటుల నడువనేర్చిన స్త్రీ ఈలోకమునందు కీర్తిని పొందును. పాపములు నశించును.

క. కామము సంకల్పంబున
బామొందెడు, దొలఁగు దేహ ♦ భావము దెలియన్
వేమరు నిది పరికించుట
క్షేమంబగు ముక్తిఁ గని సు ♦ ఖింపు కుమారీ! 83

టీ. కుమారీ! కామము=కోరిక, సంకల్పంబున=తలంచుట చేతను, బామొందెడున్=పుట్టును; దేహభావము=శరీరముయొక్క ధర్మము, తెలియన్=తెలిసినయెడల, తొలగున్=పోవును; ఇది=ఈసంగతిని, వేమరు=అనేకమార్లు, పరికించుట=యోచించుట, క్షేమము=సుఖము, అగును, ముక్తిన్ = మోక్షమును కని=పొంది, ఆనందించుము.

తా. కుమారీ! కోరిక తలంచినంత నేపుట్టి శరీరముయొక్క స్వభావము తెలిసికొనినతోడనే పోవును. దీనిని తెలిసికొనిన యెడల సుఖమును, మోక్షమును కలుగును.

క. పరజనము లాచరించెడి
దురితంబునఁ గ్రోధగుణము ♦ దోఁచెడి నధిక
స్ఫురణన్ క్షమఁ గైకొని నం
దఱుఁగునది యెఱింగి మెలఁగఁ ♦ దగును కుమారీ. 84

టీ. కుమారీ! పరజనులు=ఇతరమనుజులు, ఆచరించెడి=చేసెడి, దురితంబునన్=పాపమువలన, క్రోధగుణము=కోప మను గుణమును, తోచెడిన్=కలుగును, అధికస్ఫురణన్=గొప్ప తెలివిచేత, క్షమన్=శాంతమును, కైకొనిన్=పొందిన యెడల, తరుగున్=తగ్గిపోవును, అది=అట్టిసంగతిని, ఎరింగి=తెలిసికొని, మెలగదగున్=తిరుగవలెను.

తా. కుమారీ! ఇతరజనులుచేసిన చెడ్డపనులవలన కోపము పుట్టి మిక్కిలి తెలివివలన శాంతపడినయెడల తగ్గిపోవును. దానిని బాగుగా ఎరిగి తిరుగవలెను.

క. దృశ్యపదార్థములెల్లను
నశ్యములని తలఁపకుండి ♦ నను లోపం బౌ
దృశ్యంబున నస్థిరత న
వశ్యము చిత్తమునను దలఁప ♦ వలదె కుమారీ. 85

టీ. కుమారీ! దృశ్యపదార్థములెల్లను=కాన్పించుచున్నవస్తువులనన్నిటిని, నశ్యములని=చెడిపోవునవియని, తలపకుండినను=ఆలోచించకుండినయెడల, లోపంబు=తక్కువ, ఔను=అగును, దృశ్యంబునన్=కనబడుదానియందు, అస్థిరతన్=శాశ్వతముగా నుండకపోవుటను, అవశ్యము=నిజముగా, చిత్తమునను=మనస్సునందు, తలఁపవలదె=ఆలోచించవలదా?

తా. కుమారీ! మన కన్నులకు కాన్పించు ప్రతివస్తువును శాశ్వతముగా నుండదని మనసున తలచి యీసౌఖ్యములను ఆశించుటకూడదు.

తా. కుమారీ! మంచికులమునఁ బుట్టినను, ధనముచేతను, విద్య చేతను, గర్వము పుట్టును. వానివాని అధిక్యత నాలోచించిన మొదల గర్వము పోవును. కాబట్టి యీసంగతి నెరిగి తిరుగ వలెను.

క. మాత్సర్య మొదవు సత్యము
హృత్సరసీజమున లేమి ♦ నెల్లప్పుడుఁ దా
సత్సేవయందుఁ దిరిగిన
మాత్సర్య మణంగుఁ దెలిసి ♦ మనుము కుమారీ! 88

టీ. కుమారీ! హృత్సరసీజమునన్ = హృదయపద్మమునందు, సత్యము = న్యాయము, లేమిన్ = లేకపోవుటచేత, మాత్సర్యము = మచ్చరము, ఒదవును = పుట్టును, ఎల్లప్పుడున్ = ఏకాలమునందును, తాన్ = తాను, సత్సేవయందు = మంచివారలకొలువునందు, తిరిగినన్ = మెలగినమొదల, మాత్సర్యము = మచ్చరము, అణగును = పోవును, తెలిసి = దాని నెరిగి, మనుము = బ్రతుకుము.

తా. కుమారీ! మనస్సునందు న్యాయము లేకపోవుటచేత మత్సరము పుట్టును. పెద్దల సేవచేతను అది నశించును. ఈ సంగతి చక్కఁగా నెఱిఁగి బ్రతుకుము.

క. బహుకష్టములం బొందక
మహిలో ధనుకొనఁగ రాదు ♦ మానవజన్మం
బహహా యీజన్మంబున
నిహపరములఁ గొనెదు జాడ ♦ లెఱుఁగు కుమారీ. 89

టీ. కుమారీ! బహుకష్టములను=అనేక బాధలను, పొందక= అనుభవింపక, మహిలోన=భూమియందు, మానవజన్మంబు= మనుష్యజన్మము, సమకూడఁబోదు=కలుగదు, అహహా=సెబాస్, ఈజన్మంబునన్=ఈమనుష్యజన్మమందు, ఇహపరములన్ = ఈ లోకమునను పైలోకమునను, కొనెడిజాడలు = సౌఖ్యములు పొందుత్రోవలు, ఎఱుగు= తెలిసికొనుము.

తా. కుమారీ!అతికష్టమువీాదనుగాని మనుష్యజన్మముదొరకదు. ఈమనుష్యజన్మమును పొంది పాపములను చేయక పుణ్యముసంపాదించి సుఖంచుత్రోవనెఱిగి తిరుగవలెను.

క. ఎన్నాళ్ళు బ్రతుకఁ బోదురు
కొన్నాళ్ళకు మరణదశల ♦ గ్రుంగుట జగమం
దున్నట్టివారి కందరి
కిన్నిహితము సతముమంచి ♦ కీర్తి కుమారీ. 90

టీ. కుమారీ! ఎన్నాళ్ళు=ఎన్నిరోజులు, బ్రతుకఁబోదురు= జీవించియుందురు, కొన్నాళ్ళకున్=కొన్నిరోజులకు, మరణదశలన్=మరణించవలసివచ్చినకాలమందు, క్రుంగుట=చచ్చిపోవుట జగమందున్నవారికి=ఈలోకులకు, అందరికిన్ = ఎల్లఱకును, నిహితము=నిర్ణయము, మంచికీర్తి=మంచిపేరు, సతము=శాశ్వతము.

తా. కుమారీ! జీవులు పుట్టిన కొన్నిరోజులకు చావుతప్పదు. కీర్తిమాత్రము నశించదు.

క. పెనిమిటికన్నఁ బతివ్రత

కొని పుచ్చుకొని, పోక=వక్కను, నమలి=నమలి, సున్నము, అడుగఁబోయినన్=అడుగుటకు వెళ్లగా, ఈలోకులు=ఈజనులు నవ్వుదురు సుమీ=హేళనచేతురుసుమీ, ఘనతన్=గౌరవము చేత, మంచినడతన్=గొప్పప్రవర్తన, కైకొనవలెన్=పొందవలెను.

తా. కుమారీ! ముందు వక్కను నమలి ఆకులు చేతబట్టుకొని సున్నము అడిగినయెడల ఈజనులు నవ్వుదురు. కాబట్టి లోకవర్తనము తెలిసికొని మెలగవలెను.

క. నేలన్ వ్రాలినపత్రము
లోలిన్ జోడించి మడుచు ♦ చుండిన యవియున్
బోలఁగ సున్నపుటాకులు
దూలించు దరిద్రదశలఁ ♦ దోఁగఁ గుమారీ. 95

టీ. కుమారీ! నేలన్=భూమియందు, వ్రాలినపత్రములు=పడిన తమలపాకులను, ఓలిన్=వరుసగా, జోడించి=పేర్చి, మడుచుచుండినవియున్=మడుచుచుండినయెడల ఆతమలపాకులును, పోలఁగన్=ఆరీతిగనే. సున్నపుటాకులు=సున్నముపెట్టిన తమలపాకులును, దరిద్రదశలన్=దరిద్రపుబాధలను, తోఁగన్=పొందునట్లు, దూలించున్=కదలచేయును.

తా. భూమిమీదపడిన ఆకులున్ను, పేర్చిన ఆకులున్ను, సున్నపుటాకులున్ను, దరిద్రమును పొందజేయును.

క. ఇద్దఱు గూడుక యొక్కచో
నొద్దిక మాటాడుచుండ ♦ నొదిఁగి యొదిఁగి యా
యొద్దకుఁ జనఁగూడదు తన

పెద్దతనంబెల్ల నణఁగఁ ♦ బెట్టుఁ గుమారీ. 96

టీ. కుమారీ! ఇద్దరు కూడికన్=ఇద్దరు కలిసి, ఒకచోన్=ఒకచోటను. ఒద్దికన్=స్నేహముతోడ, మాటలాడుచుండన్=మాటలాడుచుండగా, ఒదిగియొదిగి=మిక్కిలిటక్కు, ఆయొద్దకున్=ఆదగ్గరకు, చనగూడదు=పోగూడదు, తనపెద్దతనంబెల్ల=తనఅధికతఅంతయును, అణగబెట్టుక=పాడుచేయును.

తా. కుమారీ! ఇద్దరు ఒకచోటమాటలాడుచున్న యెడల అక్కడకు పోగూడదు. అటులపోవుటవలన గౌరవము నశించును.

క తుడుపు దుమారమును జెరు
గుడుధూళియు మేషరజముఁ ♦ గూడదెపుడు మైఁ
బడ నెఱిఁగి తిరుక నేర్చిన
పడఁతుక మర్యాదలెఱిఁగి ♦ బ్రతుకు కుమారీ. 97

టీ. కుమారీ! తుడుపుదుమారమ్ము=చీపురుకట్ట ధూళియున్ను, చెరుగుడుధూళియుక = చేటతో చెరుగునప్పటి ధూళియున్ను, మేషరజము=మేకలపాదములధూళియున్ను, మైక=శరీరమునందు, పడఁగూడదు=పడుటకూడదు, ఎఱిఁగి=దానిని తెలిసికొని తిరుగనేర్చిన=మెలగుట తెలిసిన, పడతుక=స్త్రీయొక్క, మర్యాదలు=ధర్మములను, ఎఱిఁగి=తెలిసికొని, తిరుగు=మెలగుము.

తా. కుమారీ! చీపురుకట్ట ధూళియు, చేటవలనవచ్చు ధూళియు, మేకలునడచునప్పటి ధూళియు, మీదపడరాదు. దాని నెరిగి తిరుగవలెను.

మునుపే మృతిఁ బొందెనేని ♦ బురుషాగమనం
బునకెదురుచూచు వచ్చినఁ 91
గనుఁగొని యనురాగ మెనయ ♦ గలయుఁ గుమారీ. 91

టీ కుమారీ! పతివ్రత=పతిభక్తిగలస్త్రీ, పెనిమిటిన్నకా=మ
గనికంటె, మునుపే=ముందుగనే, మృతిబొందెనేని=మరణించె
నేని, పురుషాగమనంబునకు = మగనియొక్క-రాకకు, ఎదురు
చూచుకా = మగడువచ్చినవెంటనే, అనురాగము=ప్రేమ, ఎన
యన్= పుట్టగా, కలయు=అతనినికలసికొనును.

తా. కుమారీ! మగనికంటెముందుగనే చచ్చిపోయి అతని
రాక కెదురుచూచుచున్న పతివ్రత ఆతడు వచ్చినతోడనే ఆత
నితో కలిసికొని సుఖించును.

క. మునునాథుడు దరలినచో
వెనువెంటనె పోయియెల్ల ♦ వేల్పులుపొగడం
గనిపొందు నిందు నందును
ఘనకీర్తులఁ బొందుచుండుఁ ♦ గాదె కుమారీ. 92

టీ. కుమారీ! నాథుడు=మగడు, మును=ముందుగా, తరలి
నచోన్=చనిపోయినయెడల, వెనువెంటనెపోయి=ఆతనివెంట
నేస్వర్గమునకువెడలి, వేల్పులు=దేతలు, పొగడన్=కొనియా
డునట్లు, కని=మగనినిచూచి, పొందున్=అతనినికలిసికొనును
ఇందున్=ఈభూలోకమందును, అందుకా=ఆస్వర్గలోకమందును,
ఘనకీర్తులన్ = గొప్పయశములను, పొందుచుండుగాక = చెందు
చుండునుగదా.

తా. కుమారీ! తనకంటె మగడు ముందు చనిపోయిన యెడల శ్లాను గూడ అగ్నిలోపడి చచ్చిపోయి యాతనితో స్వర్గమునకు పోయి అతనిని కలిసికొనినయెడల దేవతలు మెచ్చుకొనియెదరు. ఈలోకమున గొప్పకీర్తి పొందును.

క. మఱవవలెఁ గీడు నెన్నఁడు
మఱవంగారాదు మేలు ♦ మర్యాదలలోఁ
దిరుగవలె సర్వజనముల
దరిఁ బ్రేమ మెలంగవలయుఁ ♦ దరుణి కుమారీ. 93

టీ. తరుణీకుమారీ! కీడున్=ఒకరు కలిగించిన బాధను,మరవవలెను=మరచిపోవలెను, ఎన్నడు=ఎప్పుడును, మేలు=ఒకరు చేసిన ఉపకారమును,మరువంగారాదు=మరచిపోరాదు,మర్యాదలలో=జనుల నడకలయందు, తిరుగవలెన్=నడచుకొనవలెను, సర్వజనములదరిన్=అందరి మనుష్యులయందును, ప్రేమన్=అభిమానముతో, మెలగవలెన్=తిరుగవలెను.

తా. కుమారీ! ఒకరు చేసిన అపకారమును మరువవలెను. ఉపకారమును మరువరాదు. జనులప్రవర్తన నెఱిగి అందరియెడలను ప్రేమగలిగి తిరుగవలెను.

క. ఆకుల లొసంగినఁ జేకొని
ఛేఁక నమలి స్నున్నమడుగఁ ♦ బోయినఁ గని యీ
లోకులు నవ్వుదురు సుమీ
కైకొనవలె మంచినడత ♦ ఘనతఁ గుమారీ. 94

టీ. కుమారీ! ఆకులొసంగినన్=తమలపాకు నీయగా, చే

క. దీపములనీడ మానవ
రూపంబుల నీడ శనిత ♦ రులనీడ సుఖ
ట్వాపాదిత మగునీడల
నేపట్టున నిలువఁ గూడ ♦ దెపుడుఁ గుమారీ. 98

టీ. కుమారీ, దీపములనీడన్ = దీపస్తంభములనీడను, మానవరూపంబులనీడన్ = మనుష్యులశరీరపునీడలను, శనితరులనీడన్ = తాండ్రిచెట్లనీడను, సుఖట్వాపాదితమగునీడలన్ = మంచములనీడను, ఏపట్టునన్ = ఏస్థలమునందైనను, ఎపుడున్ = ఏకాలమందైనను, నిలువఁగూడదు = నిలిచియుండరాదు.

తా. దీపపుస్తంభములనీడను, మనుష్యశరీరపునీడయందును, తాండ్రిచెట్టునీడయందును, మంచములనీడయందును, ఏవేళను నిలువరాదు.

క. కొనగోళ్ల వ్రేలు వెండ్రుక
లను జారెడు నీళ్ళుకుండ ♦ లన్ ముంతల వా
డిన వెన్క మిగులు నీళ్ళను
జనదండ్రి దరిద్రమొందు ♦ జగతిఁ గుమారీ. 99

టీ. కుమారీ! కొనగోళ్ళన్ = గోళ్ళయొక్క కొనలయందును, వ్రేలువెండ్రుకలను = వ్రేలాడుచున్న వెండ్రుకలయందును, జారెడునీళ్ళు = కారెడునీళ్ళను, కుండలన్ = కుండలయందును, ముంతలన్ = చెంబులయందును, వాడినవెన్కన్ = వాడుకొనినపిమ్మట, మిగిలినసీళ్ళు = మిగిలిననీళ్ళను, చనదండ్రి = పెద్దలు

కూడదని యందురు, జగతిన్=భూమియందు, దరిద్రము=లేమి, ఒందున్=పొందును.

తా. కుమారీ! కోనగోళ్ళనుండియు, వెండ్రుకలనుండియు, నీరు వాడినయెడల దరిద్రము కలుగును.

క. ధరఁ బక్కి కులుఁడు వేంకట
నరసింహాకవీంద్రుఁ డిట్టి నడతలు ధరపైఁ
దెఱవల తెరువులటంచును
జిరతర సత్కీర్తి వెలయఁ జెప్పెఁ గుమారీ. 100.

టీ. కుమారీ! ధరన్=భూమియందు, పక్కికులుడు=పక్కివంశమునందుపుట్టినవాడు, వేంకటనరసింహాకవీంద్రుడు, ఇట్టినడతన్=ఇట్టికర్మములను, ధరపైన్=భూమియందు, తెఱవల తెరువులటంచును = స్త్రీలధర్మమార్గములని, చిరతర = శాశ్వతమైన, సత్కీర్తిన్=మంచికీర్తి, వెలయన్=ఒప్పునట్లు, చెప్పెన్=చెప్పెను.

తా. కుమారీ! పక్కి వేంకటనరసింహాకవీంద్రుడు స్త్రీలకొఱకు ఈధర్మములను కీర్తి కలుగునటుల చెప్పెను.



